# ప్రస్తావన

*గౌ. డా. భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు*

( మధ్య ప్రదేశ్ గవర్నరు )

పర్వదినమైన వైకుంఠ ఏకాదశినాడు శ్రీ దాశరథిగారి కృతి 'మహాబోధి' మిత్రులు, బహు భాషాకోవిదులూ, సాహిత్య బంధువులూ అయిన శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారికి సమర్పించ బడినది. ఈ కావ్యాంకిత మహోత్సవము ఆంధ్ర విజ్ఞాన కేంద్ర మైన శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో జరిగినది. ఆ సందర్భంలో ఆహూతుడనై శ్రీదాశరథి కవితా మాధుర్యం రుచి చూచినాను. నలభై సంవత్సరాలనాడు ఆంధ్రోద్యమం ప్రారంభమైనప్పుడు శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు తమ కవితా పటిమతో ఆంధ్ర జాతీయాభిమానానికి, ఆత్మగౌరవానికీ పునాది వేసినారు. ఆ పునాది మీద ఎందరెందరో మహానుభావులు ఆంధ్ర కవితా సౌధ నిర్మాణం చేసినారు. శ్రీ దాశరథి వారిలో నేటివాడు. జాతియాభ్యుదయానికి కవిత ఆధారం, అవసరం. కవికీ కవిత్వానికీ కూడా లక్ష్యాలు అవసరం. ఆదికవి వాల్మీకి లక్ష్యం ఆదర్శ పురుషుణ్ణి

చిత్రించడం; అతడే శ్రీరామచంద్రమూర్తి. వేదవ్యాసుడి లక్ష్యం ఆదర్శభారతీయ సంస్కృతికి దారితీసే ఇతిహాసం సృష్టించడం; అదే మహాభారతకథ. నవ్యభారత రచనలో ఆంధ్రులకు పాలున్నది. భారతీయ స్వాతంత్ర్యోద్యమానికి స్వరాజ్యం ఏవిధంగా లక్ష్యమో అల్లాగే ఆంధ్రోద్యమానికి మహాంధ్ర నిర్మాణం పరమలక్ష్యం.

ఈ మహాంధ్రోద్యమ కవి శ్రీ దాశరథి. ఈయన తెలంగాణ వాసి కావడంలో ఆశ్చర్యంలేదు. అందుకే మహాంధ్రోద్యమాన్ని ఉపాసించినాడు. భాషమీద ప్రభుత్వమూ, భావమైశాల్యమూ కల వాడు. కవితలో ప్రవాహత వున్నది. తెలుగు నదులన్నిటినీ కలిపే ఆవేగం ఉన్నది. కవి వాక్కు అమోఘం. ఆశయసిద్ధి పొందినాడు. మహాంధ్ర కవి శ్రీ దాశరథి కావ్య కన్యకను మహాంధ్ర రాజ నీతిజ్ఞుడు శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారికి అంకితం చేయడం ఎంతో సమంజసంగా ఉన్నది. వీరిద్దరికీ పరమేశ్వరుడు ఆయురారోగ్య ఐశ్వర్యాలు ఇచ్చుగాక!

# స్వీకృతి

డా. బూర్గుల రామకృష్ణరావుగారు
హైదరాబాదు ప్రభుత్వ ముఖ్యమంత్రి

"నీ కవితా ప్రశస్తి రజనీకర
చారు మయూఖ పుంజముల్
ప్రాకెను యావదాంధ్రమున,
ప్రాజ్ఞులు మెచ్చగ బౌద్ధగాథలన్
గైకొని యల్లినట్టి నవకావ్య
వధూటిని సాదరంబుగా
నా కిడినావు, ధన్యుడను నవ్యత
దాశరథీ! కవీశ్వరా!"

# అంకితము

మా ప్రథమ ప్రజాముఖ్యమంత్రి

డా. బూర్గుల రామకృష్ణరావుగారికి

రెండువందల యేడులనుండి చిమ్మ
చీకటుల క్రమ్మి వెలుతురురేక గనని
మాకు ప్రథమ ప్రజాముఖ్యమంత్రి వీవు
కీర్తనీయ ! బూర్గుల రామకృష్ణరాయ !

కోటీయెన్బదియైదులక్షల జనుల్
గోరన్ మహామంత్రివై
ఆటంకంబులవెన్ని గల్గిన
నమేయప్రజ్ఞ నిర్జించి వా
గ్ధాటిన్ ధీపటిమన్ విధానసభ
నంతన్ మంత్రముగ్ధమ్ముగా
ఆటాడించెడి నీ మహాప్రతిభ
దేశాధ్యక్షు మెప్పించెడిన్.

రాజ్యపాలనమున ప్రజా రక్షణమున
సాహితీరంగమున కళాసరణిలోన
సార్వభౌమత్వము గడింపజాలి తీవు
కృష్ణరాయుడవే రామకృష్ణరాయ !

మూడుకోట్ల ఆంధ్రపుత్రులు నీరాజ
నమ్ము లెత్తి నిలిచినారు నీకు ;
నీ విశేష శేముషీ విలాసమునకు
మంత్రముగ్ధులై రమాత్యు లెల్ల.

నా 'మహాబోధి' కావ్యరత్నమ్ము నీకు
అర్పణ యొనర్ప వచ్చితి నందికొమ్ము
యావదాంధ్రప్రజాళికి ఆప్తుడవగు
నీకుగా కింక నే నెవ్వని కిడగలను ?

ఎద యుప్పొంగగ నీ కిదంకృతి
సమర్పింతున్ శరన్మల్లికా
సదృశంబైన భవద్యశస్సునకు
విస్తారత్వమున్ గూర్చెదన్.

పదియార్వన్నెల శారదీయ శశి
సౌభాగ్యమ్మె నీ కీర్తి సం
పదకున్ గల్గునటుల్ ఘటించెదను
కావ్యశ్రీ శరత్పూర్ణిమన్.

నాకున్ నీకు గలట్టి స్నేహమయబంధం
బీ 'మహాబోధి' కా
వ్యాకారమ్మున సాహితీ కనకపల్యంకం
బధిష్ఠించి సు
శ్రీకారత్వమునంది సౌఖ్యములు
కల్గించున్ యశశ్చంద్రికా
ప్రాకారమ్ములు కట్టి నీకొఱకు
సౌభాగ్యంబు గైసేసెడిన్.

ఒక సాహిత్యకచక్రవర్తి ప్రభువై
యున్నాడు మా రాష్ట్ర ల
క్ష్మికటం బెంతయు పొంగిపోయెదను
ఏ మేధావిలాసంబు లాం

త్రికి దివ్యాభరణమ్ములై
తెలుగుధాత్రిన్ వెల్గి వెల్గించి ఖా
వికి వే రెట్లుగ మేలుకూర్చుచు
జనప్రీతిన్ బ్రసాదించుతన్.

నా మహాంధ్రోదయమ్మను నవ్యకృతిని
సురవర ప్రతాపరెడ్డి కిచ్చుకొనినాడ
దాని కీవు పీఠికవ్రాసి దాన రెడ్డి
సుకృతి కది యొసంగుటను మెచ్చుకొనినావు.

నా కృతినాయకుండ, వధునాతన
ప్రాక్తన దేశి మార్గ సు
శ్రీకత నందికొన్న కవిశేఖరు
కావ్యరమా కరగ్రహా
లోకము యావదాంధ్రజన
లోచనపేయముగా అమేయ సౌ
ఖ్యాకరమై యశస్కరమునై
పరితుష్టుని జేయుగావుతన్.

తెలగాణమ్మొక అగ్గిబాణమయి
ధాత్రిన్ దిర్గు గాఢాంధకా
ర బలాయమ్మును నేలగూల్చినది,
పారావారమై కాంతి ఆం
ధ్రుల నేత్రాంగణమందు వెల్గినది,
ఇల్లున్ వాకిలిన్ లేని వా
రల కిల్లేర్పడె నింక సౌధమును
నిర్మాణమ్ము గావింతమా ?

మూడున్నరకోటి జనము
తోడుగ నిలచి రిదె నీకు; దుర్దినములు పో
నాడుము ధీయుంరయూనిల
తాడనమున కష్టమేఘతతి పర్వెత్తన్.

పట్టాభిగారు మన యిలు
మెట్టిన సమయాన భక్తిమెయి నీచేతం
బెట్టితి నీ కావ్యమ్మును
పట్టెను పట్టాభిషేకభాగ్యము మాకున్.

ఈయనపేరు చెప్పనిదె ఎన్నడు
గాంధిమహాత్మ శాంత్యహిం
సాయజనమ్ముగూర్చిన
ప్రసన్నచరిత్రమునన్ ప్రపూర్ణతా
శ్రీ యగుపింపబోవదు;
రచించెను భారతసచ్చరిత్ర వా
ర్జేయ నవాక్షరమ్ముల;
ప్రసిద్ధుడు భారతనాయకాళిలో.

అట్టి మహానుభావుడు మహాంధ్రధరా
ప్రియమూర్తి వచ్చె మా
పట్టణభూమి కిప్పుడు
కృపామతి సత్కవితానురక్తుడై;
పట్టగరాని హర్షమున వారి
సమక్షమునందు కావ్యమున్
పెట్టెద నీ యొడిన్ తెలుగు పెద్దల
గుండెలు పొంగిపోవగా.

శ్రీకృష్ణదేవరాడభి
ధా కీర్తిత గ్రంథనిచయ ధామమునవ్ సే
నీ కృతి నీ కర్పింతును
గైకొనుమీ రామకృష్ణ కవిలోకమణీ!

అవతారక్రమరీతి తొమ్మిదవవాడై
శాక్య మౌనీంద్రుడు
ద్భవమందెన్ భరతప్రపంచమున
శాంతం బుగ్గుపా లట్లు మా
నవులన్ బెంచి విషాదభారములు డింపన్
ముక్తి చేకూరగా
పవలున్ రేలు తపమ్మొనేసిన
మహాభాగున్ ప్రశంసింతమా?

నాలుగవ బుద్ధసంగీతి నాటి కిద్ది
అతని పాదాల అలరుగా అలరుగాక
ఆసియాఖండభవ మానవాళికెల్ల
బుద్ధ సంస్మృతి ఆనందము నిడుగాక.

టంకమును చేతబట్టి కొండలనుకొట్టి
బుద్ధగాథలు చెక్కిన పుణ్యశిల్పి
దాగియున్నాడు నా ఖటికాగళాన
పాడుచున్నాడు పద్యాలు పాట లెన్నొ.

## ష ష్ఠ్యం త ము లు

అఖిలాంధ్రలోక గణ్యా
ముఖరిత జయజయ నినాద ముదిత సుమతికిన్
ప్రఖరాశేష ప్రజ్ఞా
శిఖరారోహణ కళా ప్రసిద్ధ సుగతికిన్.

బహుభాషా సంవేదికి
ముహు రుద్ఘుష్టాఖిలాంధ్రభూసంఘటనా
విహితాంతస్స్వోమ్మదికి
సహృదయ హృదయానురాగ సంపాదికినిన్.

ఆర్తజనత్రాణవిని
ర్వర్తిత సత్కృతి కనేక భాషాకృతికిన్
మూర్తిమదాగమ కవి సం
కీర్తిత బూరుగుల రామకృష్ణనృపతికిన్.

# మ హా బో ధి

ప్రాక్ప్రపంచమందు వ్యాపించి వెలిగిన
బుద్ధతేజ మెచట పుట్టుగనెనో
అట్టి భరతభూమియందు మానవకోటి
బుద్ధమూర్తి మరచిపోవ దగునె ?

బుద్ధుని స్మరించువారల
బుద్ధికి వృద్ధత్వ మంటబోవదు ; యువతా
సిద్ధికి మహానుభావుడు
సిద్ధార్థునిగూర్చి కొంత చింత జరుపుడీ !

అతడు జన్మించి యిరువదియైదు వంద
లేడులైనవిగాని బుద్ధేతిహాస
మించుకయు రుచి తప్పలే దెవరుగాని
యెంతవ్రాసిన నంత రంగెక్కుచుండు.

కల్పించి కొన్ని గాథలు
కల్పింపక కొన్ని వ్రాసి కవులు స్వకీయా
నల్పప్రతిభాశక్తుల
నల్పెదురు ప్రజామనోరసనలకు రుచులన్.

నావంటి అల్పశక్తికు
దేవి రచించినను బుద్ధుడే తోడుపడున్
పూవునకు వసంతప్రభ
లావేశించియు వికాసమందించునటుల్.

హింసకత పెచ్చుపెరిగిన యీ జగాన
ప్రభవమైన అహింసన వ్రతులలోన
ప్రాగ్రసరుడయి సిద్ధార్థరాజు తాను
బుద్ధుడైనాడు సర్వజీవులను గావ.

అజ్ఞాన పశుచ్ఛేదన
యజ్ఞమ్మనగాక లోకు లన్యోపాయా
భిజ్ఞత గడతేరుదురే !
విజ్ఞుడు బుద్ధుండు వాని వినుడు శుభంబౌ.

అతని కనంతరీయు లయినట్టి
　　అశోక కనిష్క రాజసం
తతి యొసరించినట్టి బహుధా
　　వరణీయ క్రియాకలాపముల్
సతతము భారతప్రజల
　　చారితమున్ కనకాక్షరాళి సం
చిత మొనరించె, వారల
　　విశిష్టపథమ్మనువర్తనీయమౌ.

నరులయందెగాక నానావిధములైన
జంతుతతులయందు జననమంది
సకలభూతకోటి సాహాయ్యమునకయి
బ్రతుకు నంకితమ్మొనరచినాడు.

దయకు సాగరమ్ము ధర్మమునకు గని
సత్యమునకు తావు శాంతమునకు
పుట్టినిల్లు సత్త్వమున కాలవాలమ్ము
జ్ఞానమునకు తాన కాణయాచి.

అతని జననాంతరీయగాథాళి వినిన
హృదయమున త్యాగభావమ్ము లెగసివచ్చు
సర్వమానవ సౌభ్రాత్ర సరణి నడచి
విశ్వశాంతిని సాధించు విధము తెలియు.

అంగనామణుల తీయని స్వర్ణ కంకణ
        క్వణనమ్ము హేయమ్ముగా దలంచి
పుత్రపౌత్రాదిక ముగ్ధాననాంబుజ
        స్యంది హాసమ్ము తుచ్ఛముగ నెంచి
రాజ్య నిర్వహణ భారమునందు గల కీర్తి
        తనకు వద్దని కాలదన్నివైచి
చిరకాలముననుండి నరుల పీడించెడి
        దుఃఖపిశాచమ్ము ద్రుంచివేయ

సకలము త్యజించి కాననసరణి బోయి
దివ్యతేజోగవేషణార్థియయి, అన్న
వస్త్రములువీడి, క్లేశముబడసినాడు;
విశ్వకల్యాణమేగదా ప్రియము తనకు!

గొఱ్ఱపిల్లకు కాల గ్రుచ్చిన ముల్లుసూచి
యెంతగానో తపియించినాడు
అనుగుదమ్ముఁడు నందు డంగనాసక్తుఁడై
చెడుటజూచి చికాకు జెందినాడు
జంతుహింసలతోడ స్వర్గసాధన సేయ
జూచువారల తప్పు చూపినాడు
ప్రాక్ప్రపంచమునందు పరలు మానవకోటి
యేకీకృతికి శ్రమియించినాడు.

మార దార దురాచార మహామునందు
చేరి వేసారిపోయిన వారి బ్రతుకు
కాంతిలగ దివ్య నిర్వాణశాంతిపథము
సూపినాడు విషాదమ్ము మాపినాడు.

తెలుగువారు బుద్ధదేవు బోధామృత
మ్మానినట్టివార లనుట నిజము;
కాకయున్న కాంచగలమె శ్రీపర్వత
ప్రాంతశిల్పములను బౌద్ధగాథ.

శిథిలస్తూపముఖమ్ములన్ కనబడున్
శిల్పమ్ము లవ్వాని సం
గ్రథనన్ జాతకచిత్రముల్
మరియు లోకత్రాణ పారీణతా
నిధియౌ బుద్ధ పవిత్రవృత్తములు;
తన్నిర్మాణ నిష్ణాతు లాం
ధ్రధరా పుత్రులు; వారి
లోహఖటికాలాస్య మ్మమోఘమ్మహో !

కృష్ణవేణితల్లి కుడిప్రేవ పలనాట
వెలయు శ్రీగిరీంద్ర శిలలలోన
ఆంధ్ర బౌద్ధశిల్పు లాటలాడించిన
ఉలుల మ్రోత కుల్ల మోలలాడు.

నాగార్జునాచార్య డాగమాంతాధ్యాయి
వెలసిన సౌవర్ణపీఠభూమి;
ఇక్ష్వాకురాజుల యేల్బడిలో చేరి
సాగైన పైరుపచ్చలతలంబు

సింహళా ద్యఖిలదేశీయ భిక్షుగణమ్ము
లావసించిన విశాలావసధము
ఆంధ్రశిల్పుల నాణెమైన చెక్కడముల
కాంతులు చిమ్ము విఖ్యాతసీమ

ప్రతితెలుగువాడు గర్వించ వలసినట్టి
దివ్యదేశమ్ము; బుద్ధమూర్తికి ప్రియమ్ము,
తమ్ముడా ! రమ్ము చూచివత్తము పవిత్ర
నాగశైలాధిరాజ పుణ్యస్థలమ్ము.

అచటి విహారముల్, శిథిలమై
కళతప్పిన చైత్యరాజి, స్తూ
పచయము, శిల్పఖండములు
ప్రాక్ప్రతిభాంక నిదర్శనమ్ము లాం
ధ్రచరితమందు కానబడు
రాజిత శిల్పకళావిలాసముల్
ప్రచురతనందు నచ్చట
ప్రభాత శుభారుణ పాదపంక్తులై.

నాగరకులు తెల్గునాటివారలు నేడు
శ్రీగిరీంద్రమున వసింపబోరు!
వెనుక బడిన వారి పేర వర్తించెడి
చెంచువారలే వసింతు రందు.

వారె నాగరకులొ వీరె నాగరకులో
సహృదయులె యెరుంగజాలువారు
ప్రాఙ్మహావిభవ పారంపరీశేష
రక్తులైన బుద్ధభక్తు లెవరు?

గత మెరుంగలేని ఘను లధునాతన
స్థితిని క్రమపథాన తెలియలేరు
భావిగూర్చి యెరుగబడదు వారల కెప్డు
గత మెరుంగవలయుగాదె మొదట.

గత మొక గంగయై హృదయ
గహ్వరమున్ చొరబారి రక్తనా
ళతతి నటీవతంసమటు
లాస్యము నేసి మనస్సుమీద ము

ద్రితమయిపోవు; దానిని
హరించుట శక్యముకాదు గాన స
న్మతులు ప్రజా మనఃపథము
నాడె మెరింగి చరింపగావలెన్.

స్థాణువైన నాగశైలమ్ము పంచల
రేయు బవలు పరుగుతీయు కృష్ణ;
ఒకటి నిల్చియుండు నొకటి నిల్కడలేని
దయ్యు బుజముబుజమునంటి విడవు.

ఎత్తైన నాగశైలేంద్రు మేధావీథి
నేమి యున్నదొ చెప్పలేముగాని
అతని సాహచర్యము సేయుచుండిన
కృష్ణమ్మ ఊహించ లేదనకుము
నిశ్శబ్దముగ బుద్ధునింబోలి కూర్చున్న
అతని ఆలోచన లాకళించి
తన భాషలో పవళ్ళను రేలు పాడుచు
ఆమె వీచీ వల్లకీమృదంగ

నాదమేళనమున చెప్పగాదొడగెను
బౌద్ధమతరహస్యము; బోధపడదు మనకు
దాని తెలియుటకై కొంత సానుభూతి
కావలయు లెమ్ము పూర్వలోకమ్ముగూర్చి !

గిరి యెంత యెత్తొ ఈ ఝరి యంత లోతులే
ఒండొంటితోబోలు వ్యత్యస్తమముగ
అది నీలశిలలతో నందగించునులెమ్ము
ఇది నీలజలముతో నింపునింపు
అది భూజరాజితో నావృతంబై యుండు
నిదియు భూజమ్ములనే వహించు
అది సహస్రాబ్దమ్ములైన కంపింపదు
ఇదియు వేలేండ్లకు నింకిపోదు

ఒకటి స్థాణువైన నొకటి జంగమమౌను
భేద మంతెగాని లేదు వేర;
అయినగూడ వీడ వన్యోన్య మెన్నడు
జలశిలానుబంధసరణి గనుడు !

బుద్ధధాతువు తమ గర్భమున ధరించి
కూరుచుండిన చైత్యాల కుడ్యభూమి
బుద్ధజీవితగాథలు పొందుపరచి
ఆంధ్రశిల్పి విశిష్టతనందినాడు.

అనుకృష్ణాతట సంస్థితంబయిన
నాగాద్రిన్ విలోకించి ఆం
ధ్రుని ఔన్నత్య మెఱుంగ రమ్ము;
శిలలందున్ తా కుశాగ్రీయ బు
ద్ధిని చొప్పించి పవిత్రబుద్ధకథ
చిత్రించెన్ మహాశిల్పి; వా
నిని ఆదర్శముగా గ్రహించి
తెలుగింటిన్ చక్కగా దిద్దుమా!

* * *

అదిగో క్రీడోద్యానమందు కూర్చున్నాడు
స్వామి కాంతాసమాజమ్ము నడుమ
ఒక సుందరీమణి వికచప్రసూనాలు
దోయిటంబట్టి కన్‌తుదల చూచె

హంసతో కొలనిలో ఆటాడు నొక కన్నె
　　ఈదులాడెను చేతులెత్తి యెత్తి
పూమాల నొక బాల స్వామిపై విసరుచు
　　కటిదఘ్నమగు నీట కానిపించె

వస్త్రువచనుంగవలు తోప వనితలెల్ల
అరని నవ్వింప కవ్వింప నాటగూర్చ
యత్న మొనరించి యోటమి నందినారు
ఆతడాలోచనామగ్ను డౌటవలన.

ముసలివానిని రోగిని మున్ను చూచి
యున్న కతమున మనసులో నున్న బాధ
మిక్కుటమ్మయి నెలవేయ గ్రుక్కిపోయి
యేమొ యాలోచనము సేయు నిచట ప్రభువు,

*　　*　　*

హృదయమందలి ఆంధ్య మెగసి పోవగ నొక్క
　　మారు తెల్లని వెల్గుమల్లె విరియ
రాజాయతనమందు పూజనీయుడు స్వామి
　　కూర్చుండి నేత్రాల కొనలనుండి

ఈ మహావిశ్వమ్ము వీక్షించి ఆనంద
హాస మొనర్చె చంద్రాతప మటు
అశ్వత్థవృక్షమ్ము లప్పుడ చిగిరించె
మధు డకాలమున భూమండలమున

స్వీయ దక్షిణ పాదమ్ము పెట్టి నన్ని
దెపల కిసలయ సుమఫల విసర మెసగె
కోకిలమ్ములు తేటులు గోరువంక
లందగించెను కానన మందు వేగ.

వైశాఖ పూర్ణిమా నిశ
దేశమ్మున నన్నిదిశల దీపించెనుబో
ఆశాచంద్రిక మనుజ
క్లేశాంధ్యము వాపి అందగించెను భువిపై.

నైరంజరానదీధారలో నొక క్రొత్త
పరువు కాన్పించె సంబరమువలన
దేవతాగణములు దివ్య విమానమ్ము
లెక్కి బుద్ధుని చూడ నిచ్చగించి

భూలోకమున దిగ్గి కాలినడకతోడ
ఏతెంచినారు బోధీంద్రుకడకు
చామరమ్ముల నెత్తి స్వామికి వీచిరి
పార్శ్వమ్ములందు నప్సరలిరువురు

హస్తపద్మాలు మోడ్చి దేవాళి యెల్ల
అతనిముందల నిలంబడి అభినుతించి
నారు బుద్ధుని లోకసంత్రాణరీతి
ఆతని కృపాకటాక్షమ్ము లందికొనుచు.

ఆడిన దచ్చర యొక్కతె
పాడెను గంధర్వరాజబాలామణియున్
తోడుగ కోయిల కూయిడె
మోడులు చివురించి నవ్వుమోముల నిలిచెన్.

తాను గతరాత్రి కనిన అందాలకలల
నొక్కటొక్కటి కన్నుల నొలసియాడె
మరలమరలను భవితవ్య మెఱుకపరుప
మరలమరలను నిర్వాణసరణి దోప.

ధర పల్యంకముగా గసంబడిన
దుత్తాలాగ్ర నీహారభూ
ధరమున్ దిండుగ నుండె, తా
పడకమీదన్ నిద్దురింపంగ ప్రా
కృరథిన్ వామకరమ్ము తాకినది,
పాశ్చాత్యార్ణవం బన్యమౌ
కరమంటెన్, జరణోపధానతన
వాగ్వారాశియున్ జేకొనెన్.

ఇది తథాగతు డందెడి ఏయపూర్వ
బుద్ధతాస్ఫూర్తినో చెప్పబోలు ననగ
ప్రభునకు స్ఫురించినది మనఃఫలకమందు
తన శ్రమఫలించనున్నట్టి తరుణమందు.

తిరియ వృక్షంబు తనదు చేతిపయి బుట్టి
అంతకంతకు పెరిగి తారాధ్వమంటె
అష్టవిధపథసూచియే యగునొ యేమొ
ఇట్టి కల కర్థ మనుకొనునట్టులయ్యె.

తెల్లతెల్లని పుర్వులు నల్లనైన
తలలతో వచ్చి స్వామి పాదములనెక్కి
ప్రాకిప్రాకి మోకాళులదాక వచ్చె
అయిదు పది నూరు వే యసంఖ్యాకములుగ.

శ్వేతవసనాలు ధరియించి వివిధజనులు
హేయసంసార జంబాల మెడలిపోవ
అరుగుదెంచి తథాగతు నాశ్రయించి
శరణుశరణంట స్ఫురియించె స్వామి కందు.

భిన్నవర్ణాల నాలుగు పిట్ట లెగసి
నాల్గు దిక్కులనుండి తొందరగ వచ్చి
స్వామిపాదాలపై వ్రాలి సాగి మ్రొగ్గి
తెల్లబడిపోయె తమరంగులెల్ల డుల్ల.

బ్రాహ్మణాది చతుర్వర్ణభవులు ప్రజలు
భేదభావమ్ము లన్నియు విడచివైచి
దివ్యనిర్వాణ పదము నందికొనుకొఱకు
వత్తురు తథాగతుని చేరువకు ననంగ.

తాను గోమయరాశిమీద నడచుటయు
క్రుంగి పోకుండుటయు—తనకు జనమెల్ల
తెచ్చి యిచ్చెడి కానుకల్ పుచ్చుకొనియు
వానిపై రక్తి లేకుంటగానె తోచె.

ఈ యైదు కలలు రేఖా
ప్రాయంబుగ స్మృతికిరాగ పరిపరివిధముల్
గా యోజించుచునే రా
జాయతనమ్మున వసించె స్వామి ప్రియమునన్.

ఆపైదినమున మదనుడు
చేపలజెండా నటింప చిన్ని కొమరితల్
ప్రాపై నిలువగ తనపై
కోపమ్మున దాడిసేతగూడ స్ఫురించెన్.

మదనకుమారికామణులు మాటికి
నవ్వుల పూలబాణముల్
వదలి మనస్సు గాయపరుపఁగా
దలపోయుటయున్ వినీలనీ

రద చికురాళి గట్టిగ దలంచు
    టురోజ శతఘ్ని గోళ సం
పదల మనోభవానలముపా
    లొనరింపగ నుద్యమించుటల్.

ఒకతె నగ్నోరోజయుగ్మ మాటాడంగ
    ప్రభుపు సమక్షాన వ్రాలి మ్రొక్కు
నొకతె జారెడి చీర నొకకేల గీలించి
    వేరొంట సంజ్ఞతో పిలుచుచుండు
నొకతె శ్రోణితలమ్ము లుబ్బి కన్పింపంగ
    వెన్క వెన్కడుగులు వేసి వచ్చు
ఒకతె యూరువులపై నున్న వల్వ తొలంగ
    నృత్యమాడును మేనిరీతి మరచి

ఒకతె స్వామిని చుంబించునో యనంగ
పెదవులను చక్రమట్టుల పెట్టి వచ్చు,
నొకతె ప్రభు కవుంగిలి సేర్చునో యనంగ
బాహువులు సాచి పైపైని వ్రాలవచ్చు.

అంగదమ్ములు మ్రోయ నాటాడు నొక్కతె
వల్లకి తోడుగా పాడు నొకతె,
నలుదెసల్ పూయగా నవ్వు వేరొక్కతె
హంసలాగున నడయాడు నొకతె
మదిరాచషక మూని కదలివచ్చు నొకర్తు
వ్రాలును తన్మయత్వమున నొకతె,
స్తన ఫలమ్ములు తెచ్చి స్వామి పాదమ్ముల
నుంచి సాగిలి మ్రొక్కుచుండు నొకతె

సిగ్గు బుగ్గియొనర్చి నిశీథ మనక
పవ లనక భీతిలేక దుర్వర్తనలయి
స్వామి వంచింప జూచెడి వారి చూచి
పక్కుమని నవ్వె స్వామి కోపమ్ముమాని.

గజగజ వణకెను మదనుడు
నిజపుత్రీగణము గుండె నీరయిపోయెన్
భుజమున గల యిక్షుధనువు
వజపజలాడి భువి నూడిపడిపోయెనుబో.

శివుడు కోపింప దేహాన చిచ్చుబడెను
బుద్ధుడు హసింప నాత్మయే బుగ్గియయ్యె
తాను కాలిపోయియు విజేతయయినాడు
నాడు, నేడు కాలకయును ఓడినాడు.

వజ్రధారకన్న వాగ్ధార నిశితంబు,
తూపుకన్న రమణి చూపు వాడి,
క్రోధవహ్నికన్న రుచిరహాసము వేడి,
శాంతి జయకరమ్ము క్రాంతికన్న.

మదను డోడిపోయి మరలుటయును వాని
పుత్రికాగణమ్ము క్రుంగుటయును
స్వామి గొప్పతై జసపదార్థమును గాంచి
తృప్తితోడ కనులు తెరచుటయును.

ఏడువారాలు భోజనమేని లేక
చిక్కిపోయిన బుద్ధుని డొక్క చూచి
జాలిపడి భల్లికత్రాపుషాళి వచ్చి
బుద్ధదేవుని కంబలి వోసినారు.

వనదేవతాగణమ్ములు
చనుదెంచి మహాత్మునకు పసందగు తేనెల్
తినిపించినారు తృష్ణా
వినివారకమైన పండ్లు పెట్టిరి చేతన్.

అజపాలురు గోపాలురు
ప్రజలెల్లరు బుద్ధమూర్తి పాదమ్ముల హృత్
ప్రసజము లిడి పూజనేసిరి
రుజాగతజగమ్ము నేడరోగత నందెన్.

తేజశ్చక్రము స్వామి శి
రోజాతమ్ములవెనుక గిరుక్కున తిరిగెన్
భూజమున నున్న పక్షి స
మాజ మ్మెగసినది శాంతమతి శీర్షముపై.

తనమ్రోల భక్తిభావ
మ్మున చేతులు మోడ్చియున్న మోక్షార్థుల స్త్రీ
జనముల పురుషజనమ్ముల
గని స్వామి ప్రబోధరీతిగా నిటు లనియెన్.

భ్రమ తొలగుటయే నిర్వా
ణము; సంసారాంధువందునం గల దుఃఖాం
ధ్యము తెలిసి జనన మృతి దు
ర్గమచక్రము దాటిరండు ప్రమదం బొదవున్.

దుఃఖమునకు తృష్ణ తొలికారణం బౌను
దాని చంపివేయ బూనవలయు;
మంచివాడ వగుము మంచిగావింపుము
అంతకన్న మించినట్టి దేది ?

ఈ ప్రపంచంబునం దెన్నడేనిగాని
ద్వేషమును ద్వేషమున నిరోధింపలేము,
దాని మాయించుటకు, చిరంతన సుఖంబు
నందుటకు కావలెను ప్రేమబంధ మొకడు.

అర్ధరాత్రి నిద్దురనున్నయట్టి ఊరి
ముంచివేసెడి పెనువాగు పొంగువోలె
దారపుత్రాదులందు చిత్తము గలట్టి
నరుని నవలీల మృత్యు వంత మొనరించు.

పశువులను పక్షులను పట్టిపెంచుకొనుటకు
మానవుం డుచ్చుపన్నుగా బూనుగాని
అతడెఱుంగడు సంసార మనెడి యుచ్చు
పన్నుకొను తానె దానిలో పడును తానె.

నెత్తిపై భారమున్న వానికి విషాద,
మది తొలగిపోయినపుడు సౌఖ్యమ్ము కలుగు;
ఒక్కపర్యాయ మాభార మూడ్చివేయ
మరల దానిని వహియింప మనసుపోదు.

తృష్ణాగ్ని జిహ్వాకాగ్ర మ
హోష్ణత భరియింపరాకయుండును; తృష్ణా
జిష్ణుడవుక మ్మహింసా
నిష్ణాతతనంది శాంతినిం బడయవలెఁ.

ఆశాలత తెగిపడె నా
క్రోశింపను కామితములగూరిచి; సికతా
దేశమున నింకె వాహిని,
క్లేశ మ్మంతమయిపోయె లెమ్మిక నాకున్.

ఇది నిర్వాణపథమ్ము; దీనిపయి మీ
రెవ్వారు గానిండు మీ
పదముల్ మోపుడు, వర్ణవర్గకుల
సంప త్తేదియున్ దారి న
డ్డదు, దుఃఖాస్పదమైన ఈభవము
భ్రష్టంబౌటకున్ మున్నె అం
బుధమ ట్లార్తుల సేదదీర్పుము
రుజాభుగ్న ప్రపంచంబునన్.

నా పూర్వజన్మవృత్తము
జ్ఞాపకమున కేగుదెంచినది వినుడీ : మీ
కోపికయున్నంతగ ; నే
దాపరికములేక చెప్పదలచితి నెల్లన్.

నీ జన్మవృత్తములు విన
మోజుగలదు మాకు చెప్పుమో స్వామీ : నిన్
పూజింతుము మా హృత్సుమ
రాజిననుచు భక్తులనగ ప్రభు విట్లనియెన్.

## మ హా ప ద్మ జా త క ము

వారణాసీ ధరాధిప వరుడు బ్రహ్మ
దత్తు డాతని సుతుడనై తత్పురాన
అవతరించితి ; పసిప్రాయ మందె తల్లి
తనువు వదలె నా కొంటరితనము గూర్చి.

నాతండ్రి మరియొకర్తెను
ప్రీతిం బెండ్లాడె నామె ప్రేమయె లోకం
బాతనికి ; నన్ను మరచెను
హేతువు వచియింప నింక నేలా మీకున్.

ఒకమాటు రాజ్యమందున
నొకమూల పితూరి జరిగె నుగ్రుండై రా
జు కదలె సేనా హయహే
షకు దశదిశ లొక్కమాటు జవజవలాడెన్.

ప్రళయకాల రుద్రుభాతి యుద్ధమ్మున
తాండవించె ఖడ్గధారి తండ్రి
తిరుగుబాటుదార్లు పిరుదిచ్చి రంతలో
ప్రజకు హర్షమొదవె, రక్షకలిగె.

ఆమాట తెలిసి తండ్రికి
శ్రీమద్వారాణసీ పురిని స్వాగత మీ
గా మరియాద లొనర్పగ
ప్రేమమ్మున నేను నెదురు వెడలుచునుంటిన్.

అంతఃపురమం దుండెడి
కాంతయొకతె దారి కడ్డుగా నిలచి గృహా
భ్యంతరమున కరుదెమ్మనె
సంతసమున సవతితల్లి సరసకు చనితిన్.

ఎన్నడు నను పిలిపించని
పిన్నమ్మ యిదేల నన్ను పిలిపించె నటం
చెన్నో విధముల నెంచుచు
కన్నులు క్రిందుగను చూచి కాళ్ళకు మ్రొక్కన్.

నన్నాపాదశిరమ్ము జూచి
మదనోన్మాదమ్మునన్ కౌగిటన్
గొన్నన్ తల్లి యిదేమిటంచు
గయికోకున్నన్ క్రుధాగ్రస్తయై

ఎన్నో రీతుల నన్ను తిట్టినది
　　శిక్షింపన్ దొరంకొందునం
చన్నన్ భీతిలలేదు నే నిది
　　రహస్యం బట్టులే దాచితిన్.

ఎవరికి చెప్పలేదు, పిత
　　యేమి యెఱుంగడు దీనిగూర్చి; రా
ణి వెరగుజెందె వా_స్తవము నే
　　వచియింతు నటంచు; కాన రో
గవతినిబోలె మూల్గులిడె,
　　కారణమున్ తెలియంగ రాజు రా
నవమతి తన్ను నే చెరచితంచు
　　నబద్ధముసెప్పి యేడిచెన్.

రోషం బాకసమంట నాపిత
　　కుమారున్ పద్మనామున్ ననున్
దోషింగా తలపోసె; ఇంచుకయు
　　నాదోషంబు లేదంచు నే

ఘోషింపన్ విననొల్ల డుగ్రుడయి
నాపై కత్తిసారించు ను
ఘోషించున్ నను కొండనుండి పడగా
ద్రోయుండు చంపుం డనున్.

హంతల కొసంగు శిక్ష నా కతడొసంగె
పర్వతమునుండి క్రిందకు పడగద్రోయు
డనుచు రాజాజ్ఞ పొందినా రపుడు భటులు,
హయముపై చేరితిని పర్వతాగ్రమునకు.

రాక్షసులవంటి భటతతి
దాక్షిణ్యములేక నన్ను తలక్రిందులుగా
విక్షేపించిరి; నాగులు
రక్షించిరి నన్ను నేల రాలకమున్నే.

నేలగూలు నన్ను కేలనందెను నాగ
జాతిరాజు ప్రేమ చవుకళింప,
తన్ను తిన్నవాడు తల్పాన బడినట్లు
శిక్షనందజోవ రక్షగలిగె.

ఒక నిండువత్సరము నా
నకులమువారింట నేను గడపితి నాపై
ఒకనాడు హిమాద్రితటా
నకు చని మునివృత్తి నందినాడను సుమ్మా!

కాననపాలకుం డొకడు
కాంచెను నన్ను హిమాద్రిపాదదే
శాన; విరాగినై గిరుల
జాడల నే వసియించుటల్ పితృ
స్థానమునందు విన్నపము
సల్పెను; నా పిత దుఃఖమంది ద్వే
షానకు స్వస్తిచెప్పి
గిరిజాడల నాకుటి కేగుదెంచె తా.

వచ్చి నను కౌగిలించి తా నిచ్చినట్టి
శిక్షతప్పని, తనను శిక్షింపు మనియు
నెన్నియోరీతుల వచించె, నింక రాజ్య
మేలుకొన రమ్మనియు బ్రతిమాలె నన్ను.

తలబరు వుడిగినవానికి
తలపై బరువుంచ దలచు తండ్రిని చూడన్
కలుగునె ప్రేమము ? రాజ్యము
వలదంటిని వారణాసి వలదని యంటిన్.

అంతర్ముఖుడై యుండెడి
శాంతమనస్కున కవేల సంసారసుఖ
భ్రాంతులు ? నీహారాచల
కాంతారములే సుఖమ్ము కలిగించునుబో.

ఎంతరమ్మన్న నే పోవ నిచ్చగింప
కున్న తా దుఃఖపడుచు గృహోన్ముఖుడయి
వెడలిపోయెను ; భార్య కల్పించినట్టి
నిందమాయగ నాపె దండింపదలచి.

నా కిచ్చినట్టి శిక్షనె
ఆకాంతామణి కొసంగె నాతడు ; కానీ
నాకువలె నెవడు రక్షణ
నీకుండుటవలన నామె ఈల్గెన్ గిరులన్.

సీతికయి ప్రాకులాడుట
చేత పడినపాట్లు నాకు చెప్పందరమే
చేతము జల్లను నొక్కొ_క
పాతబ్రతుకుగాథ చెప్పవలసిన యపుడున్.

అని మహాపద్మజాతకమ్మును వచింప
నార్ద్రనేత్రాలతో బుద్ధు నాలకించు
జనులు "బుద్ధుడే శరణమా" ననిరి గగన
మురిమినది దానికిన్ పునశ్చరణ మనగ.

మరియొకనాడు మహాత్ముడు
దరహాసముఖాబ్జ చారుతరమూ_ర్తి లస
_త్తరుపాదసంశ్రితుండయి
వరణీయ స్వీయ పూర్వభవకథ చెప్పెన్.

## చాం పే య జా త క ము

నాగకాంతాజన మ్మనురాగ మొప్ప
ఫణములంగల నవరత్నగణము వెలుగ
పాదముల వ్రాలి అంజలిబట్ట నవ్వె
బోధిసత్త్వుడు నాగరాజాధిరాజు.

ఒక నాగకన్యక వికచచంపకమాల
గొనితెచ్చి ప్రభుకంఠమున లగించె
ఒక భోగినీమణి శకలితకేతకీ
దళములగూర్చి దండల నొసంగె
ఒక పృదాకుకుమారి ఊని కాంచనపాత్ర
మలయచందనపంక మలదిపోయె
ఒక నాగి తా నూగియూగి నాట్యమ్మాడి
స్వామి పాదాలపంచ పడిపోయె

ఒకతె చామరమును వీచె నొకతె చూచె
నొకతె నాగస్వరము పాడె నొకతె యాడె
ఒకతె తప్పెట వాయించె నొకతె పొంచె
సాగి యొక్కతె స్వామిని కౌగిలించె.

రత్నరాసులు తెచ్చి ప్రభుపాదముల బోసి
"కరుణించు" మనుచు నొక్కతె వచించు.
నానావిధ ప్రసూనములు దోయిట బట్టి
"కైకొ"మ్మటంచు నొక్కతె నుతించు,

విలువైన పానీయములు తెచ్చి యందించి
"అధరమ్ము గైకొను" మను నొకర్తు,
కుబుసమ్ము కన్నను సొబగు చీరము లిచ్చి
తన పైట విచ్చు సుందరి యొకర్తు,

విషము విరిగెను, హృదయాల ప్రేమ పెరిగె
భీతి కలిగించుట తొలంగె, ప్రీతి పొంగె,
బోధిసత్త్వుని కాంచిన పుణ్య మేమొ
నాగకాంతలలో అనురాగచింత.

నాగలోకమ్మునకు దొరకాగ తనను
సుందరులలోన సుందరి 'సుమన' యనెడు
నాగకన్యక పెండ్లాడినది; జనమ్ము
పిలువదొడగిరి తనను 'చాంపేయు' డనుచు.

జనులు చాంపేయ సుమనఃప్రశస్తిగాక
వేరు మాటాడ రేమియు, వారి ప్రేమ
గాథలను చెప్పుకొంటయేగాని వేరు
కథలు చెప్పుకొనంగ నాల్కలకు రాదు.

ఎట్టి వైభవ ముండిననేమి తనకు
పూర్వజన్మపరిజ్ఞానమునను వర్త
మాన హీనాతిహీన జన్మమ్ము గూర్చి
ఎంతయో భరింపగరాని చింతగలిగె.

పాపమై బ్రతుకుట హేయం
బేమార్గమునైన వెదకి ఈ జన్మ విడన్
నేమంబు భావిజన్మ
స్తోమం బుత్కృష్టవృత్తితో వెలుగవలెన్.

అనుకొని పుణ్యవాసరములందున
నాగజనంబు వీడి భూ
జనము వసించుపంచల
ప్రశాంతముగా ఉపవాసకవ్రత
మ్మును జరుపంగవచ్చుటయు
జానపదప్రమదా పదాంగద
ధ్వని విని ఆటలాడుటయు
వారిడు పాలను త్రావుచుంటయున్.

మందవాసరముల మరియును నేకాద
శీదినాల నుపవసించువాడు
ద్వాదశీ దినాల తరుణు లందించెడు
పాలుత్రావి తిరిగి వచ్చువాడు.

కరచు ననెడు భయము మరచి కాంతామణుల్
పామునోట నావుపాలు పోయ
తనను చంపజూతురను భీతినే మాని
పాము తీయనైన పాలుత్రావు.

ఇట్టీ స్నేహపు బీజము
చెట్టై చేమలయి వృద్ధిజెందెను జనముల్
పోట్లాటమాని ప్రేమము
మాట్లాడగ దిగిరి ; నాగమహిమం బెంతో.

ఇది తెలిసి యొక్కనా డొక
హృదయములేనట్టి బాప డీసర్పము ప
ట్టదలచి పల్లీపరిసర
పదమున నాగస్వరమ్ము పాడదొడంగెన్.

నాగస్వరపుపాట నాగాధిపతి యాట
పల్లీజనులకు సంబరముగూర్చె
బాప డూదినకొద్ది పడగ పైపైకెత్తి
త్రాగినట్టుల సోలసాగె నాగు
వేగమ్ముగా బాప డూగి వాయింపంగ
తోకపై నిలబడి తొణకె పాము
మంద్రస్థితినిమీరి మరి తారమును జేరి
పాట ఆకాశాన పర్వదొడగె

కనులు కనరావు పాముకు; తనువునిండ
శ్రవణములుగా తదేకదీక్ష వినజొచ్చె
పాడిపాడి హఠాత్తుగా పాటయాగె
బ్రాహ్మణాధము బుట్టలో పాముపడియె.

బుట్టం బామును దూరిచి
గుట్టలు చెట్టులను దాటికొను చరిగె. ద్విజుం:
డట్టె ఉడికెను గ్రామము;
తిట్టిరి బాపనిని ఊరి స్త్రీజనమెల్లన్.

ఉరీతి తనను వైగెకొని
పారిన బ్రాహ్మణుని దుష్టవర్తన తనకున్
తెరని బాధను గూర్చిన
నూరకొనెను ద్విజు వధించు నూహయె లేకన్.

ఎన్నినాళ్ళకు నాగరా జేగుదెంచ
డయ్యె నింటికి; నాగలోకాంగనాళి
దేశదేశాలు గాలించి తిరిగివచ్చి
గుండెలను బాదుకొని కలగుండుపడియె.

బలవంతుడు సాధుండయి
చెలగిన ప్రతివాడు గేలిసేయును; వాడే
కలిగి యొక దెబ్బతీసిన
తొలగుదు రెల్లరును ప్రక్కతోవల వెంటన్.

వ్రతనిష్ఠుడైన నాగుడు
చితికిన సంసారివోలె క్షీణించి ప్రశాం
తతతో కాలమువుచ్చెను
గతి యొండేదియును లేని కారణమున తా.

దుర్బలనాగుని చేకొని
బర్బరుడయి బాప డపుడు బహుదేశములన్
దర్బారుల నాడించెను
కర్బుర సంపాదన ప్రగాఢాపేక్షన్.

అతడు చెప్పినట్టు లాటాడు నాగంబు
పెట్టినట్లు తినును ముట్ట దన్య
మెవని నేమి యనదు నివసించు బుట్టలో
బయట విడచిపెట్ట పారిపోదు.

అతడు రాజాధిరాజయ్యు నతివినమ్రు
డై ద్విజునిచెంత కీటమ ట్లణగియుండె
తన కిది పరీక్షయనుకొనె దాంతి శాంతి
నభ్యసింపంగ కోపమ్ము నణచికొనగ.

శుభనక్షత్రము చూచి యొక్కతరి
నచ్చో వారణాసీ పుర
ప్రభు నాస్థానపదంబు బ్రాహ్మణుడు
చేరంబోయి నాగాధిరాడ్

విభు నాడించదొడంగె విస్మితుని
గావింపన్ నృపున్; తన్మహా
సభ ఆశ్చర్యముచెంద నాడదొడగెన్
సర్పంబు దర్పంబునన్.

ద్విజుడు నాగస్వరంబు వాదించదొడగె
అతనిముందు ఫణమ్మెత్తి యాడసాగె
నాగరాజు వారాణసీనాథు డలర
అతని కాంతామణులుగూడ హర్షమంద.

ఆడియాడి చటుక్కున నాగె పాము
పడగముడిచి బాపని కాళ్ళపజ్జ వ్రాలె
కారణం బేమనుచు రాజు కలత జెంద
సుమన యేతెంచె రాట్సమక్షమున కపుడు.

భార్యజూచి సిగ్గుపడెను చాంపేయుండు
తన నిహీనగతికి తలను వాంచె
కంట నీరునిండ కొంత గద్గదకంఠి
చెప్పలేక ఇట్లు చెప్పదొడగె.

“నాగలోకరాజు నా కితండు ప్రియుండు
రాగ ముడిగి భువి విరాగి యగుచు
ఉపవసించు చెదియు తప మాచరించుచు
ఈప్రదేశముల చరించుచుండ-

బాప డతని పట్టి బంధించి వంచించి
ఇట్టు లాటలాడ బెట్టినాడు
శాంత చిత్తుడైన స్వామి యేమనలేక
ఆజ్ఞయిచ్చినట్టు లాటలాడు.

దేశదేశాలు గాలించితిని, నదీన
దాలు వెదకితి భూమీధరాలుగూడ
చూచివచ్చితి నెచ్చట దాచినాడొ
నేడు మీచెంత ఆడించినాడు జడుడు.

నాపతిని నాకొసంగుడు
కాపాడుడు సాధుజీవగణమును, శాంతిన్
స్థాపింపుడు జగమున, నా
కాపురమును బాగుసేయ కడగుడు స్వామీ !”

అని విలపించెడి నాగిని
గని రాజోత్తముడు తాను కన్నీరిడియెన్
ప్రణమిల్లె నాగవరునకు,
వినుతించె తదీయశాంతవృత్తిని ఇట్టుల్.

"అతడు సామాన్యనాగరా జగు టబద్ధ
మేమహాబోధిసత్త్వుండొ ఇట్లు జన్మ
మెత్తి మనకెల్ల శాంతి బోధించుచుండె;
నతని విడువు" మటంచు బ్రాహ్మణుని గోరె.

అత డట్లుసేసె; సుమన
స్సతి నాగుని కౌగిలించె; సకలజనమ్ముల్
నుతియించిరి రాజోత్తము
నుతియించిరి నాగరాజునున్ వేనోళ్ళన్.

ధర్మచక్రముద్ర దాలిచి కూర్చుండి
శాక్యముని అశేషజనముమ్రోల
తన పురాభవముల వినిపింప తనువులు
మరచి వినిరి స్వామి మహిమ జనులు.

పూర్వజన్మవృత్తాంతముల్ పొల్లుపోవ
నీయక వచించు నా కుశాగ్రీయబుద్ధి
అతని ప్రాగ్జన్మచక్రమర్యాదతెలియ
నువ్విళులనూరుచు జనాళి యున్నయపుడు.

బుద్ధమూర్తి భూమిస్పర్శముద్రలోన
కూరుచుండి గంభీరవాగ్ధార వెలయ
బ్రహ్మజాల సూత్రమ్ములు పలికె గహన
విషయములుగూడ సులభమై ప్రీతిగూర్ప.

ఒక మధుమాసోషస్సున
శకలిత నిశ్శబ్దతాకచరణాస్త్రముచే
వికసితనేత్రుడు బుద్ధుడు
సకలజనులు విన 'ఛదంత చరితము' నొడివెన్.

## ఛ దం త జా త క ము

హిమగిరీంద్రమందు కమనీయ కాసార
మొకటి గలదు, దాని ఊర్మికాళి
ప్రాణికోటికెల్ల శ్రమవారకము ; ప్రాణ
ధారకమ్ము సౌఖ్యకారకమ్ము.

ఆ సరస్సుచుట్టు నలరు పుష్పవనమ్ము
లేడు, వానివెన్క నేడుగిరులు
గిరులలోన స్వర్ణగిరి మహోత్తాలంబు
దాన నొక గుహాపదమ్ము గలదు.

ఎనిమిదివేల వారణము
        లీగుహలో వెలసెఁ ; షదంత నా
ముని నొక శ్వేతవారణము
        బుద్ధుని పూర్వభవావతారమూ
ర్తిని తమ నాయకుండుగ
        వరించెను ; తత్ప్రభు వెండితొండమున్
గనుగొని ఆరుదంతములు
        గాంచి గజాఘట పొంగిపోయెడిన్.

ఆత దెన్బదియెనిమిది యడుగులెత్తు
నూటఇరువది అడుగుల పాటి పొడవు
చారు శారదమల్లికాసదృశ తనువు
ధీర గంభీరమైన శృంగారమూర్తి.

ఇక్షురసంబుల కుక్షులు నింపుచు
శారద ర్తువులను సాగనంపు.
వెలగపండులు మెక్కి చలికాలములలోన
ఒకదానినొకటి కప్పుకొని పండు,

చలియనగ లేదు ఎండల జాడ లేదు
వర్షముల బాధలేదు ప్రహర్షకమ్మ
ప్రతిపవలు రాత్రియును ప్రతివార మేని
ప్రతిఋతువుగాని వారణత్రయమునకును.

ఇట్లు శతసహస్ర శరత్తు లేగె బాల
భాను కిరణమ్మ ధాటికి వ్రాలినట్టి
మంచుబిందువువలె త్రుటిమాత్రమందు;
కాల మెఱుగగరాదు సౌఖ్యమ్మునందు.

ఒకనాడు విధివశమ్మున
నొక సాలముక్రింద నిలచియున్నపుడు ప్రభుం
డకలంకవృత్తి పుష్ప
ప్రకరాంచితశాఖ నూపె స్వకరవరమునన్.

అంత 'మహాసుభద్ర'పయి
నన్నియు పూవులె వ్రాలెగాని దు
ర్దాంతముగాగ 'శూలసుభద్రా'
శిరమందున నెండుటాకు లే
త్రింతలు నెఱ్ఱచీమలు మరింతగ
దుమ్ముదుమారముం బడెన్
చింతిలె భర్తృపాక్షికవిచేష్టకు
'శూలసుభద్ర' యెంతయున్.

మనమున క్రోధము దుఃఖము
పెనగొని ముంచెత్తె; పూర్వవిభవము మరచెన్
తనకును తన సవతికి ఇం
ధనములు లేకుండ నగ్గి దార్కొనె మదులన్.

అవమానము భరియింపం
గ వశముగా కెంతొ కుంది కడకు ప్రతీకా
ర విధాన మెఱుంగక ఒక
దివసమున మహాంధువందు దిగి చనిపోయెన్.

తేనె యొక్క నీటికణమ్ముతోన చెడును
స్నిగ్ధరాగము ద్వేషాన చివికిపోవు
ఆడవారి మనమ్ములయందు ప్రేమ
పుట్టుటకు గిట్టుటకు ప్రొద్దుపట్ట దెంతొ.

ఇట్టులా వారణాంగన గిట్టుటయును
అటు మగధరాజపుత్రి పుట్టుటయు జరిగె
కరిణి ఈజన్మ మానవతరుణి యయ్యె
పూర్వపతిపై ప్రతీకారమునకు కడగె.

పెద్దదైనపిదప పిత తన్ను కాశికా
రాజపుత్రుతో కరగ్రహణము
కూర్చె; తాను రాచకొమరితయే యయ్యె
పెండ్లి కాకమున్ను, పెండ్లిపిదప.

జాతిస్మరత్వమున తన
చేతము పూర్వావమానశిఖల నెఱియగా
నాతరుణి యెపుడు రుణ్ణి
ర్యాతన మొనరించుపొంచె నారాటపడున్.

తాను షడ్దంతు జంపింపబూని వార
ణాసి గల వేటకాంద్ర నందరిని పిలిచె
అందరినిమించి సోను త్తరాభిఖుండు
క్రూరుడుగ వీరుడుగను ధీరుడుగ దోచె.

హిమగిరీంద్రకాననమున నున్న హ్రదమ్ము
పంచలందు సంచరించు వాని
ఇంద్రధనువువోలె నేపారు వివిధవ
ర్ణాల ఆరుకోరల గజరాజు

కోరలన్ని కోసికొని తెచ్చియిత్తువే
కోటిరూప్యములను కొలచిపోతు
వనుచు రాణి చాటినపుడు సోను త్తరుం
డట్టులే యటంచు కొట్టె తొడను.

ఈ లెలు బల్లెమ్ములతో
పోటరులగు వేయిమంది ముందునడువగా
ఆటోపంబున హిమగిరి
కూటానకు నడచె నేన్గుకోరలు తేరన్.

ఎట్టిపాప మెరుగనట్టి శ్వేతగజమ్ము
కోర లూడబెరుక గోరువాని
జూచి హైమశిఖరి చాచి మంచుకరాలు
అతని అనుచరులను మోతిపి చంపె.

ఏడేండ్లు నేడుమాసము
లేడు దినమ్ములు హిమాద్రి నెక్కి సరసి నీ
రాడెడు సితనాగేంద్రము
జాడ తెలిసి సాలసాలశాఖల డాగెన్.

సాయంతన మా గజపతి
పోయినతరి చెట్టుడిగ్గి భూమి వెడల్పౌ
గోయిని త్రవ్వెను దానిని
మాయికు డాతండు మూసె మరి తృణములతో.

ఉదయాన స్నానమునకై
మదగజరాజంబు వచ్చి మాయయు మర్మం
బెది యెఱుగ కందు గూలెను
పొదగుందెను శోణితమ్ము పొడపొడగారన్.

కేళ్ళు నొప్పిపెట్ట ఘీంకారముసుచేసె
ఆ మహాధ్వనికి గజాళి భీతి
జెంది పారిపోయె చెల్లాచెదరుగాగ
కంట తడిని పెట్టె గహనలక్ష్మి.

క్రకచము చేతబట్టుకొని
రాక్షసున ట్లురుదెంచె వేటగా
డొక పొదమాటునుండి
గజయూధము పారిన వెన్క- కోటిరూ
పికలపయిన్ దురాశ
ఎదవీడక ; వానిని జూచి ఇట్లు నా
గకులవిభుండు వల్కెను—
"పగన్ వహియించెదవేల నాపయిన్ ?

మానవుల కెంతొ దూరాన మంచుకొండ
లందు నివసించి ఆకుల నలముల తిని
బ్రతుకుబుచ్చెడి నన్ను చంపితివయేని
యేమిలాభించు నీకు వచింపు మయ్య ?

నిన్నెన్నడైన నేమే
నన్నానా ? నిన్నుగాక అన్యులనేనిన్
బిన్నముపాల్సేసితినా
అన్నా !" యన నాత డిట్టు లను నాగముతో.

"వారణాసి రాజుపడతి నీ కోరలు
కోసి తెమ్మటంచు కోరె నన్ను
దాన వచ్చినాడగాని నాకును లేదు
శత్రుభావ మెంతమాత్రమేని."

వారణాసి రాజుపత్ని యెవ్వతొ తాను
వెంటనే యెఱింగి పెల్లు కుందె
దాని క్రోధవహ్ని తన దంతషట్కమ్ము
నొసగి చల్లజేయ నొప్పుకొనియె.

క్రూరుడు రంపముతో తన
కోరలు కోయందొడంగె గూడలు నొవ్వ
కోరలు వజ్రసమమ్ములు
గా రహాయించినవి తెగవుగద యించుకయున్.

"నీవు కోయజాల వీ వజ్రదంతాళి
నేను తొండమున బిరాన కోసి
నీకొసంగువాడగాక" యంచు గజమ్ము
అతనినుండి రంప మందుకొనియె.

"రాణి మనసు శాంతిలగ నాదు దంతాళి
గోసియిత్తు వీని గొంచుపొమ్ము;
ఒకరి మనసు శాంతిలకయున్న నాకును
శాంతిలేదు, మదిని వంతపోదు.

నా ప్రాణం బిడియైన ఆమెమది
యానందింపగా జేసెదన్
శీఘ్రంబే; పరజీవితమ్ములకు
శాంతిన్‌గూర్చుటే లెస్స; ఘూ
నప్రాయంబగు జీవితంబు విడువన్
సంకోచమేలేదు—నా
కీ ప్రారబ్ధ మికెన్నిజన్మముల
నెత్తింపించునో సోదరా!"

అని దంతావళరాజము
తన దంతమ్ములను గోసి తనసతి కిమ్మం
చు నొసంగిన నా క్రూరుడు
కనికరమొప్పంగ కంట కన్నీరిడియెన్.

వేటకానికంట వెడలిన కన్నీరు
తనకు శాంతిగూర్చె తాను రాక్ష
సుని మనస్సునందు కనికరమునుగూర్ప
గలిగె ననుచు తృప్తిగాంచె గజము.

వేటకాడు దుఃఖవివశుడై దంతాలు
చేతబట్టి పాపభీతి నరిగె,
పరుల మనసు తృప్తిపడున ట్లొనర్చితి
ననుచు గజము తృప్తినంది మడిసె.

చెల్లెడ్చె దుఃఖభరమున
గల్లెడ్చెను గుట్టలేడ్చె కాననమే తా
రట్లాడె నేమితోచక
పోట్లాటలుమాని సింహములు చింతించెన్.

వేటకా డేగి కోరలర్పించె రాణి
కెల్ల వృత్తాంత మతడు వర్ణించిచెప్పె;
తన ప్రభువు వజ్రదంత సంతానముగని
గోడుగోడున నేడ్చి గగ్గోలు పడియె.

తనలోని పిశాచత్వం
బొనరించిన ఘోరపాపకృత్యము పెంచం
బును కలచి క్లేశపరుపగ
తనువు విడచె దుఃఖవహ్ని తగులంబెట్టన్.

"ఇది నా 'ఛదంత జాతక'
మెదనొచ్చను చెప్పునపుడు నిది విన్నపుడున్
పొదయిది" యని బుద్ధుం డన
ప్రిదిలినమది సజ్జనాళి విని రూర్పులతో.